## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050018973

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు

# నీతిశాస్త్రము

మంగు వేంకటరంగనాథరావువలన

ముద్రించి ప్రకటింపబడియె.



మొదటికూర్పు 1000 ప్రతులు

కాకినాడ.

శ్రీవేంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షరశాల.

1913 వెల 0—2—0

శ్రీ రస్తు

# నీతిశాస్త్రము — ప్రథమ[...]

శ్లో॥ సభాకల్ప తరుంవందే వేదశాఖోప జీవితమ్ ।
శాస్త్రపుష్ప సమాయుక్తం విద్వద్భ్రమర శోభితమ్॥

తా॥ సభయనెడు కల్పవృక్షమునుగూర్చి నమస్కరించుచున్నాను. ఆసభయెట్టిదనిన వేదములనెడి కొమ్మలచే వృద్ధిబొందింపబడి శాస్త్రములనెడు పుష్పములతోగూడి విద్వాంసులనెడు తుమ్మెదలచే ప్రకాశింపబడునట్టిది. అనగా వేదశాస్త్రాది సంపన్నులైన బ్రాహ్మణుల సభనుగూర్చి నమస్కరించెదను॥ ౧

శ్లో॥ ప్రణమ్య సర్వలోకేశం దేవదేవేశ్వరం హరిమ్ ।
నీతిశాస్త్రం ప్రవక్ష్యామి సర్వశాస్త్రార్థ సమ్మతమ్॥

తా॥ సర్వలోకేశ్వరుండును సకలదేవతలకు దేవుండునైన శ్రీమన్నారాయణునిగూర్చి నమస్కరించి సకలశాస్త్రార్థ సమ్మతమైన నీతిశాస్త్రమును జెప్పుచున్నాను॥ ౨

ధర్మరాజ ఉవాచ॥

శ్లో॥ సత్యం మాతాపితాజ్ఞానం ధర్మో భ్రాతా దయాసఖా ।
శాంతిఃపత్నీ క్షమాపుత్రష్షడేతే మమబాంధవాః॥

తా॥ సత్యముతల్లి జ్ఞానముతండ్రి ధర్మము తోడబుట్టినవాడు దయస్నేహితుడు శాంతి భార్య క్షమకుమారుడు యీయాఱుగురు నాకిష్టులైన బంధువులని ధర్మరాజుచెప్పెను॥ 3

భీమ ఉవాచ॥

శ్లో॥ ప్రాణైరపి పరిత్యజ్యమానమేవాభిరక్షతు ।
అనిత్యోభవతి ప్రాణోమాన ఆచంద్రతారకం॥

తా॥ తనకుమానహాని కరమైన యాపదవచ్చినప్పుడు ప్రాణమునైనవిడిచి మానమును రక్షించుకొనవలయు. అదెట్లన్ననిన ప్రా

ణాము క్షణభంగురమైయున్నది మానమయితే చంద్రసూర్యాదులు నుంచువరకు నుండునని భీముండు చెప్పెను॥ ౪ అర్జునఉవాచ॥

శ్లో॥ ఆమంత్రణోత్సవావిప్రా గావోన వత్సణోత్సవాః ॥

భర్త్రాగమోత్స వానార్యాస్సహం కృష్ణ రణోత్సవః॥

తా॥ సామాన్యమైన బ్రాహ్మణులకు పరులయింటి భోజనము సంతోషకరము గోవులకు పచ్చగడ్డి సంతోషకరము పతివ్రతలకు దేశాంతరముపోయిన తమపురుషుడు వచ్చుట సంతోషకరము యుద్ధము నాకు సంతోషకరమని యర్జునుడు చెప్పెను॥ ౫ నకులఉవాచ॥

శ్లో॥ మాతృవత్పర దారాంశ్చ పరద్రవ్యాణి లోష్ఠవత్ ।

ఆత్మవత్సర్వ భూతాని యఃపశ్యతి సపశ్యతి॥

తా॥ పరస్త్రీనితల్లివలెను పరద్రవ్యమును మంటిపెళ్ళవలెను సకలభూతములను తనవలెను ఎవడుచూచునో ఆతడు బ్రహ్మజ్ఞాని యగునని నకులుడు చెప్పెను ॥ సహదేవఉవాచ ॥ ౬

శ్లో ॥ అనిత్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః ।

నిత్యంసన్నిహితోమృత్యుఃకర్తవ్యోధర్మసంగ్రహః ॥

తా ॥ శరీరమనిత్యము సంపత్తుశాశ్వతముకాదు. మృత్యువెల్లప్పుడు దగ్గరయుండునుకాబట్టిధర్మసంగ్రహమే చేయదగినదని సహదేవుడు వచించె ॥ ద్రౌపద్యువాచ ॥ ౭

శ్లో ॥ సుందరంపురుషందృష్ట్వాభ్రాతరంపితరంసుతం ।

యోనిర్ద్రవతినారీణాం తథ్యంమేబ్రూహికేశవ ॥

తా ॥ తోడబుట్టినవానిగాని తండ్రినిగాని కొమారునిగాని రూపవంతుడైన పురుషునిచూచిన స్త్రీలకు యోనిద్రవించును, దీనితత్వమును ఓకేశవ నాకు తెలుపుమని ద్రౌపదిచెప్పెను ॥ ౮

శ్లో ॥ పంచమేపతయస్సంతిమహ్యంషష్ఠోపిరోచతే ।

పురుషాణామభావేన సర్వానార్యఃపతివ్రతాః ॥

తా ॥ నాకైదుగురు పతులుండినను ఆరవవానిమీద నిచ్చయున్నది కావున లోకమందలి స్త్రీలకు పురుషులు సందర్భపడకుండుటచే

తె పతివ్రతలయియున్నారని ద్రౌపదిచెప్పెను ॥ ౯

శ్రీకృష్ణఉవాచ ॥ శ్లో ॥ ఔదుంబరాణిపుష్పాణిశ్వేతవర్ణంచవాయసం ।
మత్స్యపాదంజలే పశ్యేన్న నారీహృదయస్థితం ॥

తా ॥ మేడిపువ్వులనైన గానవచ్చును తెల్లకాకినైనగానవచ్చును నీళ్ళలోని చేపలయడుగులనైనగానవచ్చును స్త్రీలయొక్క హృదయము తెలియరాదని శ్రీకృష్ణుడు చెప్పెను ॥ ౧౦

శ్లో ॥ దుర్భిక్షేచాన్నదాతారం సుభిక్షేచహిరణ్యదం ।
చతురోహంనమస్యామిరణేధీరమృణేశుచిమ్ ॥

తా ॥ దుర్భిక్షకాలమందు అన్నదానముచేయువానిని సుభిక్షకాలమునందు ధనముదానముజేయువానిని రణమందుధైర్యముగలవానిని ఋణమందుశుచిగలవానిని అనగా అప్పులేనివానిననుట ఈనలుగురికి నేను నమస్కరింతునని శ్రీకృష్ణుడుచెప్పెను ॥ ౧౧

కర్ణఉవాచ॥ శ్లో ॥ విప్రహస్తే ధనందద్యాత్స్వభార్యాయాంచయౌవనం । స్వామికార్యేషుచప్రాణం నిశ్చయోమమమాధవ ॥

తా ॥ ఓకృష్ణా! తానుసంపాదించినసొమ్మును బ్రాహ్మణవినియోగముజేయవలయు తనయౌవనమును తనభార్యయందు వినియోగముజేయవలయు తనప్రాణమును స్వామికార్యములయందు వినియోగపరచవలయునని నానిశ్చయమని కర్ణుడుచెప్పెను ॥ ౧౨

## చాటువాక్యములు.

శ్లో ॥ సర్వస్యగాత్రస్య శిరఃప్రధానం సర్వేంద్రియాణాం నయనంప్రధానం ॥ షణ్ణాంరసానాం లవణంప్రధానం భవేన్నదీనాముదకంప్రధానం ॥

తా ॥ దేహమునకంతటికిని శిరస్సు ప్రధానము ఇంద్రియములన్నిటికి కన్నులు ప్రధానము రసములకన్నిటికిని లవణము ప్రధానము నదులకంతటికి నుదకము ప్రధానము ॥ ౧౩

శ్లో ॥ మృత్పిండఏకోబహుభాండరూపస్సువర్ణ ఏకంబహుభూషణాని।

గోక్షీరమేకంబహుధేనుజాతమేకఃపరాత్మాబహుదేహవర్తీ॥

తా॥ భాండములువేర్వేరు మన్నొకటి సొమ్ములువేర్వేరు బంగారొకటి ఆవులు వేర్వేరు పాలొకటి అట్లు శరీరములు వేరువేరు పరమాత్మయొక్కటి యనుట॥ ౧౪

శ్లో॥ అర్థాతురాణాం నగురుర్నబంధుః కామాతురాణాంనభయం నలజ్జా। విద్యాతురాణాంనసుఖంననిద్రా క్షుధాతురాణాం నరుచిర్నపక్వం॥

తా॥ అర్థాశాపరవశులకు గురుబంధువులులేరు కామాతురులకు వెరపు సిగ్గు లేదు విద్యాపేక్ష గలవారికి సుఖమును నిద్రయును లేదు ఆకలిగొన్నవారికి రుచిపక్వములు లేవు॥ ౧౫

శ్లో॥ దాతాదరిద్రః కృపణోధనాఢ్యః పాపీచిరాయుస్సుకృతీగతాయుః। రాజాకులీనస్సుకులేనసేవ్యః కలౌయుగేషడ్గుణమాశ్రయంతి॥

తా॥ దాతయైనవాడు దరిద్రుడౌట కృపణుడు ధనాఢ్యుడౌట పాపిష్టుడు దీర్ఘాయుష్కుడౌటపుణ్యాత్ముడుఅల్పాయుష్కుండవుటకులహీనుడు రాజౌట కులశ్రేష్ఠుడు సేవకుడౌట ఈయారుగుణములను కలియుగమునందు బొందుచున్నారని తాత్పర్యము॥ ౧౬

శ్లో॥ భార్యావియోగస్స్వజనాపవాదః ఋణస్యశేషఃకుజనస్యసేవా। దారిద్ర్యకాలేప్రియదర్శనంచ వినాగ్నినాపంచదహంతికాయం॥

తా॥ భార్యావియోగము సజ్జనులు దూరుటయు ఋణశేషము కులహీనుని సేవయు దారిద్ర్యకాలమునందు ఇష్టములజూచుటయు ఈయైదును శరీరమును నిప్పులేకయే దహించును॥ ౧౭

శ్లో॥ పుస్తకంవనితావిత్తం పరహస్తం గతం [illegible]
అథవా పునరాయాతి జీర్ణం భ్రష్టా చ [illegible]

తా॥ పుస్తకము వనితధనము ఒకరిచేతికిపో[illegible] వదిపోయినది తెరు. ఒకవేళతిరుగావచ్చినను పుస్తకముజీర్ణమైన[illegible] వనిత భ్రష్టురాలైవచ్చును. ధనముఖండఖండములుగా వచ్చును॥ ౧౮

శ్లో॥ ఆయుర్వి[illegible]గృహచ్ఛిద్రం మంత్రౌషధ సమాగమాః।

నీతిశాస్త్రము-ప్రథమభాగము.

దానమానావమానాశ్చ నవగోప్యాని...భిః॥

తా॥ అయువు దారిద్ర్యము గృహచ్ఛిద్రము ... ఔష ధము సంగమము దానము మానము అవమానము ఈతొమ్మిదియు బుద్ధిమంతులగువారిచే బరులకు తెలియనీక దాచదగినవి॥

శ్లో॥ ఋణానుబంధరూపేణ పశుపత్నిసుతాలయాః ।
ఋణక్షయే క్షయం యాంతి కాతత్రపరివేదనా ॥

తా॥ సకలజనులకు పశువులు పెండ్లాము కొమాళ్ళు ఇండ్లును జన్మాంతర ఋణసంబంధములచేత గలుగుచున్నవి. ఋణముతీరగానే నశించుచున్నవి. కాబట్టి ఈయర్థమునందు వ్యసనమేమి॥

శ్లో॥ దూషకశ్చక్రియాశూన్యో నికృష్టోదీర్ఘకోపనః ।
చత్వారః కర్మచండాలాజాతిచండాల ఉత్తమః ॥

తా॥ పరులదూషించువాడు అవశ్యకర్తవ్యకర్మశూన్యుడు అతిలోభముగలవాడు దీర్ఘక్రోధముగలవాడును వీరునలుగురు కర్మచండాలురు వీరికంటె జాతిచండాలుడుత్తముడని తెలియునది॥

శ్లో॥ రాజవత్పంచవర్షాణి దశవర్షాణిదాసవత్ ।
ప్రాప్తేషోడశవర్షేతుపుత్రంమిత్రవదాచరేత్ ॥

తా॥ చిన్నకొడుకై నైదేండ్లపర్యంతము రాజువలెను పిమ్మట పదియేండ్లపర్యంతము దాసునివలెను పదియారేండ్లు మొదలుకొని స్నేహితునివలెను చూడవలయును॥ ౨౨

శ్లో॥ ఏకైకాగా స్త్రియస్సింహాః॥ పంచవ్యాఘ్రాః ప్రసూతిభిః।
అధర్మోనష్టసంతానో ధర్మస్సంతానవర్ధనః ॥

తా॥ ...లు మూడేసిగాబుట్టును పులులు అయిదేసిగాబుట్టును ఐనను ...ధర్మము వారిసంతానమును నాశనముజేయుచున్నది గోవులు ఒంటొంటిగాబుట్టినను వారిధర్మము వారిసంతానమునువృద్ధిజేయుచున్నది గావున ధర్మమే జేయవలెను॥ ౨౩

శ్లో॥ బాలార్కః ప్రేతధూమశ్చవృద్ధస్త్రీపల్వలోదకం ।
రాత్రౌదధ్యన్నభుక్తిశ్చఆయుఃక్షీణందినేదినే ॥

తా॥ ఉదయకాలమునందు నెండకాచుకొనుటయు పీనుగుకాలె డు పొగమీద బారుటయు తనకంటె పెద్దదానితో సంగమముజేయుట యు ఆకుముదిగిన నీళ్ళు ద్రావుటయు ఇవి దినదినమునకు ఆయుస్సును దరుగజేయును॥ ౧౩

శ్లో॥ వృద్ధార్కో హోమధూమశ్చ బాలస్త్రీ నిర్మలోదకం ।
రాత్రౌ క్షీరాన్నభుక్తిశ్చ ఆయుర్వృద్ధిర్దినేదినే॥

తా॥ సాయంకాలమునందు యెండకాచుకొనుట హోమముజే యుపొగ యొడలిమీద బారుట తనకంటె చిన్నదానితో సంగమముజే యుట మంచినీళ్లు త్రాగుట రాత్రిక్షీరాన్న భోజనముజేయుట ఇవిదినది నము ఆయుస్సును వృద్ధిబొందించును. ౧౪

శ్లో॥ ఉత్తమం స్వార్జితంవిత్తం మధ్యమం పితురార్జితం ।
అధమం భ్రాతృవిత్తంచ స్త్రీవిత్త మధమాధమమ్॥

తా॥ తాను సంపాదించినసొమ్ము ఉత్తమము తండ్రిసొమ్ము మ ధ్యమము తోడబుట్టిన వానిసొమ్ము అధమము స్త్రీసొమ్ము మిక్కిలిఅ ధమము॥ ౧౫॥

శ్లో॥ ఉత్తమా కులవిద్యాయా మధ్యమా కృషివాణిజాత్ ।
అధమా సేవయావృత్తిః మృత్యుశ్చోర్యేప జీవనమ్॥

తా॥ తాను తనకులవిద్యవలన జీవనముజేయుట ఉత్తమము కృ షివల్లను వర్తకమువల్లను జీవించుట మధ్యమము కొలువుకొలిచి జీవిం చుట అధమము దొంగతనముచేత జీవించుటకంటె చావుమంచిదని తె లియవలెను॥ ౧౬॥

శ్లో॥ ఉత్తమే క్షణకోపస్స్యాన్మధ్యమే ఘటికాద్వయం ।
అధ మేస్యాదహోరాత్రం పాపిష్ఠే మరణాంతకః॥

తా॥ కోపము ఉత్తమునియందు క్షణకాలముండును మధ్యము నియందు రెండుఘడియలుండును అధమునియందు నొకయహోరాత్రి ముండును పాపిష్ఠునియందు చచ్చెడుపర్యంతముండును॥ ౧౭

శ్లో॥ ఆత్మబుద్ధి స్సుఖంచైవ గురుబుద్ధిర్విశేషతః।

పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయంకరీ ॥

తా॥ తనబుద్ధి సుఖమునిచ్చును గురుబుద్ధి విశేషముగాసుఖము నిచ్చును పరబుద్ధి చెరుచును స్త్రీబుద్ధి చంపును॥ ౨౮

శ్లో॥ అతిథౌతిష్ఠతిద్వారిహ్యాపోగృహ్ణాతియోనరః ।
ఆపోశనం సురాపాన మన్నంగోమాంసభక్షణం ॥

తా॥ వాకిటనున్న అతిథినివిడిచి ఆపోశనముపుచ్చుకొన్న ఆయాపోశనము సురాపానసమంబు అన్నము గోమాంసభక్షణసమానంబు ॥

శ్లో॥ దర్శనాచ్చిత్తవైకల్యం స్పర్శనాత్తుధనక్షయః ।
సంభోగాత్కిల్బిషం పణ్యస్త్రీణాం ప్రత్యక్షరక్షసామ్ ॥

తా॥ వారస్త్రీలయొక్క దర్శనమువలన మనస్సునకు వైకల్యముపుట్టును స్పర్శమువలన ధనక్షయమౌను సంభోగమువలన పాపము సంభవించును అందువలన వేశ్యలు ప్రత్యక్షరాక్షసులు ॥ ౨౯

శ్లో॥ దాసీమానధనంహంతి హంతివేశ్యాధనాదికం ।
ఆయూంషివిధవాహంతి సర్వంహంతిపరాంగనా ॥

తా॥ దాసీసంగమము మానముపోగొట్టును వేశ్యాసంగమము ధనాదులపోగొట్టును విధవాసంగమము ఆయుస్సు క్షీణింపజేయును. పరాంగనాసంగమము అన్నిగుణంబుల బోగొట్టును ॥ 30

శ్లో॥ దుర్జనంకాంచనంభేరీం దుష్టస్త్రీం దుష్టవాహనమ్ ।
ఇక్షుఖండాన్ తిలాన్ శూద్రాన్ మర్దయేద్గుణవృద్ధయే ॥

తా॥ దుర్జనులను బంగారును భేరిని దుష్టస్త్రీని చెడుగుఱ్ఱమును చెఱకుగడలను నువ్వులను శూద్రులను గుణవృద్ధికొరకు మర్దింపవలెను ॥ ౩౧

శ్లో॥ నగచ్ఛేద్ద్విజయుగ్మంచ నగచ్ఛేద్బ్రాహ్మణత్రియం ।
చతుశ్శూద్రానగచ్ఛేయుర్నగచ్ఛేద్వైశ్యపంచకం ॥

తా॥ ఒకానొక కార్యమునకు పోవునపుడు ఇద్దరుక్షత్రియులు ముగ్గురు బ్రాహ్మణులు నలుగురు శూద్రులు ఐదుగురు వైశ్యులును పోరాదు పోయిన నాపనికానేరదు ॥ 33

శ్లో ॥ ఉషశ్శ్యంసగార్గ్యస్తు శకునంతుబృహస్పతిః ।
మనోజయంతుమాండవ్యో విప్రవాక్యోజనార్దనః ॥

తా ॥ ఏకార్యమునకైన బోవుటకు ఉషఃకాలము మంచిదని గార్గ్యునిచెప్పెను శకునముచూచుకొని పోవలయునని బృహస్పతిచెప్పెను. మనస్సునిపుణుడై లుతలచిన కార్యము సఫలమగుననినిస్సంశయముగా దోచినపుడు పోవలయునని మాండవ్యునిచెప్పెను. బ్రాహ్మణవాక్యము శ్రేష్ఠమని జనార్దనుడు చెప్పెను ॥ విప్రవాక్యోజనార్దనః ॥ అనెడు పాఠమందు భగవంతుండు బ్రాహ్మణునిచేత జెప్పించును గనుక బ్రాహ్మణవాక్యము భగవద్వాక్యమువలె నమ్మవలెను ॥ ౩౩

శ్లో ॥ శర్వరీదీపకశ్చంద్రః ప్రభాతోద్దీపకోరవిః ।
త్రైలోక్యదీపకోధర్మస్సుపుత్రః కులదీపకః ॥

తా ॥ చంద్రుడు రాత్రిని ప్రకాశింపజేయును. సూర్యుడు పగటిని ప్రకాశింపజేయును ధర్మముమూడులోకములను ప్రకాశింపజేయును. సుపుత్రుండు కులమును ప్రకాశింపజేయును ॥ ౩౪

శ్లో ॥ సబంధుర్యోహితేషుస్స్యాత్సపితాయస్తుపోషకః ।
ససఖాయత్రవిశ్వాసస్సాభార్యాయత్రనిర్వృతిః ॥

తా ॥ హితముకోరినవాడే బంధువుడు పోషించినవాడే తండ్రి విశ్వాసముగలవాడే స్నేహితుడు సుఖపజేయునట్టిదే భార్యయనుట ॥ ౩౫

శ్లో ॥ అర్థానామార్జనేదుఃఖ మార్జితానాంచరక్షణే ।
నాశేదుఃఖం వ్యయేదుఃఖం కిమర్థందుఃఖభాజనం ॥

తా ॥ ద్రవ్యము సంపాదించుటయందు దుఃఖము దానికాపాడుటయందుదుఃఖము దానినాశనమునందువ్యయమందును దుఃఖముకాబట్టి దుఃఖములకు మూలమైన ధనమెందుకనుట ॥ ౩౬

శ్లో ॥ హరిణాపిహరేణాపిబ్రహ్మణాపిసురైరపి ।
లలాటలిఖితారేఖా పరిమార్ష్టుంనశక్యతే ॥

తా ॥ విష్ణువు చేతగాని ఈశ్వరునిచేతగాని బ్రహ్మచేతగానిఇతరులైన దేవతులచేతగాని నొసటవ్రాయబడినవ్రాతతుడిచివేయనలవిగా

చెముసుష్యమాతుర్రించేత నేమి కాగలదు ॥

శ్లో ॥ ఘృతేనవర్ధతే బుద్ధిః క్షీరేణాయుష్యవర్ధనం ।
శాకేనవర్ధతే వ్యాధి ర్మాంసం మాంసేనవర్ధతే ॥

తా ॥ నేతిచేత బుద్ధియు పాలచేనాయుశ్శు కూరగాయలచే వ్యాధియు మాంసముచేత మాంసమువృద్ధిబొందుచున్నవి ౪౦

శ్లో ॥ ఉత్సాహస్సాహసంధైర్యం బుద్ధిశ్శక్తిః
పరాక్రమః షడేతేయత్రతిష్ఠంతి తత్రదేవో౽పిశంకతి।

తా ॥ సంతోషముసాహసముధైర్యముబుద్ధిశక్తిపరాక్రమము ఈయారునెవనియందుగలవో వానికిదైవముభయమాను ॥ ౪౧

శ్లో ॥ అసంతుష్టోద్విజోనష్ట స్సంతుష్టఇవపార్థివః ।
సలజ్జాగణికానష్టా నిర్లజ్జేవకులాంగనా ॥

తా ॥ తృప్తిలేనిబ్రాహ్మణుడు తృప్తిబొందెడురాజు సిగ్గుగలవేశ్య సిగ్గులేనియిల్లాలు వీరలు చెడుదురు ॥ ౪౨

శ్లో ॥ వేదమూలమిదంబ్రాహ్మ్యం భార్యామూలమిదంగృహం
కృషిమూలమిదంధాన్యం ధనమూలమిదంజగత్ ।

తా ॥ బ్రాహ్మణులకు వేదమేమూలము గృహమునకుభార్యమూలము ధాన్యమునకు కృషిమూలము జగత్తునకు ధనమేమూలము ॥

శ్లో ॥ శిలాస్థగంధ లేపశ్చమార్జాలోచ్ఛిష్టభోజనం ।
ప్రతిబింబేక్షణంనీరేశక్రస్యాపిశ్రియంహరేత్ ॥

తా ॥ రాతిమీదపెట్టినగంధముపూసుకొనుట పిల్లి తాకినయన్నము భుజించుట నీళ్ళలో నీడచూచుకొనుట ఈపనులు ఇంద్రునికైన ఐశ్వర్యమును బోగొట్టును ॥ ౪౪

శ్లో ॥ అజారజఃఖరరజస్తథాసమ్మార్జనీరజః ।
స్త్రీణాంపాదరజశ్చైవ శక్రస్యాపి శ్రియంహరేత్ ॥ ౪౫

తా ॥ మేకలకాలిదుమ్ము గాడిదెకాలిదుమ్ము చీపురుకట్టదుమ్ము స్త్రీలకాలిదుమ్ము ఇవిపైనపడిన ఇంద్రునికైన నైశ్వర్యము తొలగిపోవును ॥

శ్లో ॥ కృషితోనాస్తి దుర్భిక్షం జపతోనాస్తి పాతకం ।

మౌనేనకలహోనాస్తి నాస్తిజాగరతోభయం ॥

తా ॥ కృషి చేసుకొనేవానికి కరవులేదు జపముచేసుకొనేవానికి పాపములేదు మౌనముతోనున్నవానికి కలహములేదు మేల్కొనియున్న వానికి భయములేదు ॥ ౪౮

శ్లో ॥ ఏకోపిగుణవాన్ పుత్రో నిర్గుణేనశతైరపి ।
ఏకచంద్రప్రకాశేనన తత్రైః కింప్రయోజనమ్ ॥

తా ॥ సకలగుణసంపన్నుడైన కొమారుడొక్కడే చాలును దుర్మార్గులయిన కొమారులు నూరుగురున్న నేమి ప్రయోజనమున్నది. ఇందుకు నిదర్శనము ఒక చంద్రుండుదయమైనలోకమంత ప్రకాశింపు చున్నది. ఆచంద్రుండు లేక నక్షత్రములెన్నియున్న నేమి ప్రయోజనమున్నది ॥ ౪౯

శ్లో ॥ ప్రస్తావసదృశంవాక్యంస్వభావసదృశీక్రియామ్ ।
ఆత్మశక్తిసమంకోపం యోజానాతిసపండితః ॥

తా ॥ ప్రస్తావమునకుదగినమాట పరులస్వభావమునకు దగినకార్యము తనశక్తికిదగిన కోపము యెవడెరుంగునోవాడువివేకి ॥ ౫౦

శ్లో ॥ వివాదశీలాంస్వయమర్థచోరిణీం పరానుకూలాం పరిహాసభాషిణీం । అగ్రాశినీమన్యగృహప్రవేశినీం త్యజంతిభార్యాం దశపుత్రమాతరం ॥

తా ॥ జగడమాడెడుస్వభావముగలదానిని ఇంటిసొమ్ము దొంగిలించుదానిని పరులకనుకూలమైనదానిని పరపురుషులతో పరిహాసమాడుదానిని పెనిమిటికన్న ముందుభుజించుదానిని ఎల్లప్పుడుపొరుగింటిలో వంచరించుదానిని ఈగుణములుగలిగిన పెండ్లాము పదిబిడ్డల తల్లియైనను దానినివిడువవలెను ॥ ౫౧

శ్లో ॥ కార్యేషుదాసీ కరణేషుమంత్రీరూపేచలక్ష్మీః క్షమయాధరిత్రీ ।
స్నేహేచమాతాశయనేషువేశ్యా షట్కర్మయుక్తాకులధర్మపత్నీ ॥

తా ॥ ఇంటికార్యములయందు తొత్తువలెను కార్యాలోచనయందు మంత్రివలెను రూపమందు లక్ష్మివలె ఓర్పునందు భూమివలె స్నేహ

యందు తల్లివలె పడకయందు వేశ్యవలె ఉనికిగవ్రితివిషయమై ప్రవ
ర్తించునది కులస్త్రీయనబడును ॥ ౫౦

శ్లో ॥ నవిషంవిషమిత్యాహుర్బ్రహ్మస్వం విషముచ్యతే ।
విషమేకాకినం హంతి బ్రహ్మస్వంపుత్రపౌత్రికం ॥

తా ॥ విసమువిసముగాదు బ్రాహ్మణులసొమ్మువిషము, విష
మువలన నొక్కడేచచ్చును బ్రాహ్మణులసొమ్ము నపహరించినవాని పు
త్రపౌత్రాదులును నాశన మొందుదురు ॥ ౫౧

శ్లో ॥ శతనిష్కధనాఢ్యశ్చశతగ్రామేణభూపతిః ।
శతాశ్వః క్షత్రియోరాజా శతశ్లోకేనపండితః ॥

తా ॥ నూరువరాలు గలిగినవాడు ధనికుడనిపించుకొనును నూరు
గ్రామముల కధిపతియైనవాడు భూపాలుడనిపించుకొనును నూరుగుఱ్ఱము
లుగలవాడు రాజనిపించుకొనును నూరుశ్లోకములు నేర్చినవాడు పండితు
డనిపించుకొనును ॥ ౫౨

శ్లో ॥ శకటంపంచహస్తేషుదశహస్తేషువాజినం ॥
గజంహస్తసహస్రేచదుష్టందూరేచ వర్జయేత్ ॥

తా ॥ బండినిజూచిన నైదుమూరలదూరము తొలగిపోవలెను.
గుఱ్ఱమునుజూచిన పదిమూరలదూరము తొలగిపోవలెను ఏనుగునుజూచి
న నేయిమూరలదూరము తొలగిపోవలయు దుర్జనునిజూచిన మిక్కిలి
దూరము తొలగిపోవలయు ॥ ౫౩

శ్లో ॥ అనభ్యాసేవిషం శాస్త్రమజీర్ణేభోజనంవిషం ।
దరిద్రస్యవిషంగోష్ఠీ వృద్ధస్యతరుణీవిషమ్ ॥

తా ॥ అభ్యాసములేనివానికి శాస్త్రమేవిషము జీర్ణముకాక
యున్నపుడు భోజనమేవిషము దరిద్రునికి వినోదగోష్ఠియేవిషము ముసలి
వానికి వయసుపెండ్లామేవిషము ॥ ౫౪

శ్లో ॥ జిహ్వాగ్రేవర్తతేలక్ష్మీర్జిహ్వాగ్రేమిత్రబాంధవాః ।
జిహ్వాగ్రేబంధనప్రాప్తిర్జిహ్వాగ్రేమరణంధ్రువం ॥

తా ॥ నాలుకవలన సంపతు గలుగును నాలుకవలన చుట్టాలు

స్నేహితులువత్తురు నాలుకవలన సంకిళ్ళుప్రాప్తమగును నాలుకవలనే చావుగలుగును॥ ౫౫

శ్లో॥ అదానదోషేణభవేద్దరిద్రో దారిద్ర్యదోషేణకరోతిపాపమ్।
పాపాదవశ్యం నరకంప్రయాతి పునర్దరిద్రఃపునరేవపాపీ॥

తా॥ పూర్వజన్మమందునొకరికివ్వని దోషమువలన దరిద్రుడగును ఆదరిద్రమువల్ల పాపమొనర్చును ఆపాపమువలన నరకముప్రాప్తియగును ఆనరకమందే కొన్నాళ్ళుండి ఆసిమ్మట మరలదరిద్రుడై పుట్టును॥ ౫౬

శ్లో॥ అతిథిర్బాలకశ్చైవ స్త్రీజనోనృపతిస్తథా।
ఏతేవిత్తంనజానంతి జామాతాచైవపంచమః॥

తా॥ అడుగవచ్చెడు అతిథి, చిన్నవాడు, స్త్రీలు, రాజులు, అల్లుడు, ఈయైదుగురును కలిమిలేము లెరుంగరు॥ ౫౭

శ్లో॥ కుదేశంచకుమిత్రంచ కురాజ్యంచకుబాంధవమ్।
కుభార్యాంచకురాష్ట్రంచ దూరతఃపరివర్జయేత్॥

తా॥ కొరగానిదేశము కొరగానిస్నేహితుడు కొరగానిరాజ్యము కొరగానిబంధువు కొరకాని పెండ్లాము కొరగానిపట్టణము వీనినిదూరము న బరిత్యజింపవలయు॥ ౫౮

శ్లో॥ స్త్రీణాంద్విగుణమాహారం బుద్ధిశ్చాపిచతుర్గుణం।
సాహసంషడ్గుణంచైవ కామోష్టగుణఉచ్యతే॥

తా॥ స్త్రీలకు పురుషులకంటె నాహారము రెండుపాళ్ళెక్కుడు బుద్ధినాల్గుపాళ్ళధికము సాహసము ఆరుపాళ్ళు మోహము కోరికయెనిమిదిపాళ్ళధికమనియెరుంగు॥ ౫౯

శ్లో॥ రాజారాష్ట్రకృతంపాపం రాజపాపం పురోహితః।
భర్తాచస్త్రీకృతంపాపం శిష్యపాపంగురుర్వ్రజేత్॥

తనదేశములో ప్రజలుచేయు పాపమును రాజుపొందును రాజుచేయుపాపమును పురోహితుడుపొందును పెండ్లాముచేయుపాపమును మగడుపొందును శిష్యుడుచేయు పాపమును గురువుపొందును॥ ౬౦

శ్లో॥ గీతేవాద్యే తథానృత్తే సంగ్రామే రిపుసంకటే।

ఆహారే వ్యవహారే చత్యక్తలజ్జ స్సుఖీభవేత్॥

తా॥ సంగీతము పాడునపుడు, వాద్యము వాయించునపుడు, నాట్యమాడునపుడు, శతృవులతో పోరాడునపుడు, భోజనము జేయునపుడు వ్యవహార మాడునపుడు, ఈపనులయందు సిగ్గుపడరాదు॥ ౯౧

శ్లో॥ రూపయౌవన సంపన్నా విశుద్ధకుల సంభవాః।
విద్యాహీనా నశోభంతే నిర్గంధ మివకింశుకం॥

రూపముప్రాయము మంచికులగోత్రములు ఇవిగలవారైనను విద్యలేనివారు ప్రకాశింపరు అదియెట్లనిన మోదుగపువ్వు యెంతయెరుపు గలిగినదైనను పరిమళములేనందువలన ప్రకాశింపదు గదా ఆలాగే యనుట॥ ౯౨

శ్లో॥ త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులంత్యజేత్।
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీంత్యజేత్॥

తా॥ ఒకకులమునకు హానిగలుగునపుడు అందుకు హేతుభూతుడైన యొకనివిడువవలయు గ్రామముకొఱకు కులమునువిడువ వలెనుఒకదేశనిమిత్త మొకగ్రామమును విడువవలయుతనకుపద్రవమువచ్చినపుడు తనకుగలభూమిని విడువవలయు॥ ౯౩

శ్లో॥ కోకిలానాం స్వరోరూపం పాతివ్రత్యం తుయోషితాం।
విద్యారూపం విరూపాణాం క్షమారూపం తపస్వినాం॥

తా॥ కోకిలమునకు స్వరమేరూపము స్త్రీలకు పాతివ్రత్యమేరూపము కురూపునకు విద్యయేరూపము యతులకు శాంతియేరూపము॥ ౯౪

శ్లో॥ దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తుదైవతం।
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా॥

తా॥ ఈలోకమంతయు దైవాధీనమై యుండును ఆదైవమును మంత్రాధీనమైయుండును, ఆమంత్రముబ్రాహ్మణాధీనమైయున్నది కాబట్టి బ్రాహ్మణులునాకు దైవమని శ్రీకృష్ణమూర్తి అనితెచ్చెను॥ ౯౫

శ్లో॥ పిబంతినద్యస్స్వయమేవనాంభః ఖాదంతి నస్వాదుఫలానివృక్షాః॥పయోధరాస్సస్యమదంతినైవ పరోపకారాయసతాం

విభూతయః ॥

తా ॥ నదులు నీళ్ళనుతాగవు వృక్షములు ఫలించిన ఫలములను తాము భక్షింపవు, మేఘములు వర్షించి పండించిన ఫలములను తాము భక్షింపవు, అట్లులోకమందు ధర్మాత్ములయిన సత్పురుషులు సంపాదించిన ధనము చేపరోపకారము జేతురు ॥ ౧౭

శ్లో ॥ పక్షిణాంబలమాకాశం మత్స్యానాముదకంబలం ।
దుర్బలస్యబలంరాజా బాలానాంరోదనంబలం ॥

తా ॥ పక్షులకు ఆకాశము బలము, చేపలకునీళ్ళుబలము, బలహీనునకు రాజుబలము, చిన్నవాండ్రకు రోదనము బలము ॥ ౧౭

శ్లో ॥ వృశ్చికస్యవిషంపుచ్ఛం మక్షికస్యవిషంశిరః ।
తక్షకస్యవిషందంష్ట్రా సర్వాంగందుర్జనేవిషం ॥

తా ॥ తేలునకుతోకయందు, ఈగకుతలయందు, పాముకుకోరలయందు, దుర్జనునికి సర్వాంగములయందును, విషముండును ॥ ౧౮

శ్లో ॥ పుస్తకేషుచయావిద్యా పరహస్తేచయద్ధనం ।
సమయేతుపరిప్రాప్తే నసావిద్యానతద్ధనం ॥

తా ॥ పుస్తకములోని చదువు పరులచేతికిచ్చినధనము ఇవివేళకుపయోగించవు ॥ ౧౯

శ్లో ॥ నశ్యత్యనాయకం కార్యం తథా వశిశునాయకం ।
స్త్రీనాయకంతథోన్మత్త నాయకంబహునాయకం ॥

తా ॥ యజమానుడులేని కార్యము, బాలురు స్త్రీలు ఉన్మత్తులు. అనేకులు వీర్లు విచారించుకార్యములు ఈరెండును చెడిపోవును ॥ ౨౦

శ్లో ॥ అభ్యాసానుసరీవిద్యా బుద్ధిః కర్మానుసారిణీ ।
ఉద్యోగసారిణీలక్ష్మీః ఫలంభాగ్యానుసారిణీ ॥

తా ॥ అభ్యాసమువలన విద్యవచ్చును, కర్మానుసారముగ బుద్ధి గలుగును, ఉద్యోగానుసారముగా నైశ్వర్యమువచ్చును భాగ్యానుసారముగ ఫలముగలుగు ॥ ౨౧




శ్లో ॥ వసంతేయౌవనావృక్షా పురుషా [illegible]
సౌభాగ్యయౌవనానార్యో యువానో [illegible] ॥

తా ॥ వృక్షములకు యౌవనము వసంతఋతువు, పురుషులకు ధనముయౌవనము, స్త్రీలకుభాగ్యమేతరుణము, పండితులకు విద్యయే వయస్సు ॥ ౭౨

శ్లో ॥ వృథావృష్టిస్సముద్రేచవృథాతృప్తే తుభోజనం ॥
వృథాధనవతోదానం దరిద్రేయౌవనంవృథా ॥

తా ॥ సముద్రమునవర్షించుట, ఆకలిలేనివానికి భోజనము పెట్టుట, ధనవంతునకు దానముచేయుట, దరిద్రునకుగలయౌవనము ఇవి నిష్ప్రయోజనములు ॥ ౭౩

శ్లో ॥ అర్థాగృహేనివర్తంతే శ్మశానేమిత్రబాంధవాః ।
సుకృతందుష్కృతంచైవగచ్ఛంతమనుగచ్ఛతి ॥

తా ॥ అర్థము సంపాదించి ధర్మముసేయక।దాచినను లోకాంతరగతుడైనపుడాయర్థము గృహమందుండునుగాని వెంటరాదు, పుత్రమిత్ర బాంధవులు శ్మశానపర్యంతము వత్తురు ఆవెనుక తన వెంట రారు, పుణ్యపాపములు రెండును వెంటవచ్చును, గనుక ధర్మమేచేయవలయును ॥ ౭౪

శ్లో ॥ తస్కరస్య వధోదండో దాసీదండ స్తుముండనం ।
భార్యాదండం పృథక్ఛయ్యా మిత్రదండ మభాషణం ॥

తా॥ దొంగకుహింసించుట దండనము తొత్తుకు తలగొరిగించుట దండనము భార్యకుతనశయ్యకు రానీయకుండుట దండనము స్నేహితునికి మాట్లాడకుండుట దండనము॥ ౭౫

శ్లో ॥ పితాచఋణవాన్ శత్రుర్మాతాచ వ్యభిచారిణీ ।
భార్యారూపవతీ శత్రుః పుత్రశ్శత్రురపండితః ॥

తా॥ కొమారులకు అప్పుపెట్టిపోయినతండ్రి శత్రువు వ్యభిచారిణియైనతల్లి శత్రువు రూపవతియైన భార్యశత్రువు విద్యలేనికొడుకు తండ్రికిశత్రువు॥ ౭౬

శ్లో॥ పితారక్షతి కౌమారే భర్తారక్షతి యౌవనే ।
రక్షంతివార్ధకే పుత్రాన స్త్రీస్వాతంత్ర్యమర్హతి॥

తా॥ స్త్రీలను బాల్యమందు తండ్రియు యౌవనమందు పెనిమిటియు ముదిమియందు కొమారులు రక్షింతురు కాబట్టి యొకకాలమందు స్త్రీలకు స్వాతంత్ర్యములేదు॥ ౭౭

శ్లో॥ అగ్నిహోత్రిం గృహంక్షేత్రిం గర్భిణీ వృద్ధబాలకౌ ।
రిక్తహస్తే ననోపేయా ద్రాజానం దైవతం గురుమ్॥

తా॥ అగ్నిహోత్రమునకు మంత్రపూర్వకాహుతులిచ్చునప్పుడును గృహము, పుణ్యక్షేత్రము, గర్భిణిస్త్రీలు, వృద్ధులు, బాలురు, రాజులు, దేవుడు, గురువు వీరలకడకును వట్టిచేతులతో బోరాదు అనగా ఫలాదుల తీసుకొనిపోవలయును॥ ౭౮

శ్లో॥ అహోప్రకృతి నాదృశ్యం శ్లేష్మణో దుర్జనస్యచ ।
మధురైః కోపమాయాతి కటుకై రుపశామ్యతి॥

తా॥ దుర్జనులు శ్లేష్మము సమానమైయున్నది యెట్లనిన శ్లేష్మము తీపుచే వృద్ధినికటువుచే నాశమును యెట్లుపొందునో ఆప్రకారమే దుష్టుడు మంచిమాటలచేత కోపమును తీక్ష్ణవాక్యములచేత వెరపును బొందును॥ ౭౯

శ్లో॥ జనితా చోపనీతాచ యేసవిద్యో పదిశ్యతే ।
అన్నదాతా భయత్రాతా పంచైతే పితరస్స్మృతాః ॥

తా॥ కన్నతండ్రి ఉపనయనము జేసినవాడు విద్యచెప్పినవాడు అన్నముబెట్టినవాడు భయముదీర్చినవాడు ఐదుగురు తండ్రులని భావము

శ్లో॥ దరిద్రాయ కృతందానం శూన్యలింగస్య పూజనం । ౮౦
అనాథ ప్రేత సంస్కార మశ్వమేధ సమంవిదుః॥

తా॥ దరిద్రునికొరకు చేయబడినదానము పూజలేనిగుడికి పూజగలుగజేయుటయు దిక్కులేనిపీనుగు నెత్తికాల్చుటయు ఈమూడును అశ్వమేధ సమానములు॥ ౮౧

శ్లో॥ దాతృత్వం ప్రియ వక్తృత్వం ధీరత్వ ముచితజ్ఞతా ।

అభ్యాసేనసలభ్యంతేచత్వారస్సహజాగుణాః ॥

తా॥ ఈవి వినయింపుగాబలుకుట ధైర్యము మంచిచెడు తెరంగు తెలుంగు తెలివియీనాల్గునుతనతోడబుట్టుగుణములు కాని నేర్చుకొనుటచేగ లుగవనుట ॥ ౮౨

శ్లో॥ అభుక్త్వామలకంపథ్యంభుక్త్వాతుబదరీఫలం ।
కపిత్థంసర్వదాపథ్యంకదళీనదాచన ॥

తా॥ పరిగడుపున ఉసిరికాయయు భోజనానంతరము రేగుపండును ఎల్లప్పుడు వెలగపండ్లు భుజించుటచేత శరీరారోగ్యము గలుగును అరటిపండెప్పుడును పథ్యముగాదు ॥ ౮౩

శ్లో॥ శ్లోకార్ధేన ప్రవక్ష్యామియదుక్తంగ్రంథకోటిభిః ।
పరోపకారః పుణ్యాయపాపాయపరపీడనం ॥

తా॥ అనేకగ్రంథములచేత జెప్పబడినవిషయమును నేనియర్థశ్లోకమందు జెప్పెదను అదియెట్లనిన పరులకుపకారముచేయుట పుణ్యముకొరకును పరులనుపీడించుట పాపముకొరకును ॥ ౮౪

దుష్టాభార్యాశఠంమిత్రం భృత్యోహంకారసంయుతః ।
ససర్పేచగృహేవాసో మృత్యురేవనసంశయః ॥

తా॥ గయ్యాళియైన భార్యయును, కుత్సితుడైన స్నేహితుడును, అహంకారముగలిగిన భృత్యుడును, సర్పముతోగూడిన గృహమందువాసమును మనుష్యులకు నిస్సంశయముగా మరణావస్థను గలుగజేయుననుట. ౮౫

శ్లో॥ యస్మిన్ దేశే నసన్మానో నప్రీతిర్నచ బాంధవాః ।
నవిద్యా నాస్తిధనికా నతత్రదివసం వసేత్ ॥

తా॥ ఏదేశమందు సన్మానమును, ప్రియమును, బంధువులు, విద్యయును, ధనికులు లేకుండినచో అచ్చట నొకదినమైనవసింపగూడదు. ౮౬

శ్లో॥ అగ్నిహోత్ర ఫలావేదా దత్తభుక్త ఫలంధనం ।
రతిపుత్ర ఫలాదారా శీలవృత్త ఫలంశ్రుతం ॥

తా॥ వేదముచదివినందుకు అగ్నిహోత్రము చేయుటయు ధన

ముగలిగినందుకు దానభోగములును, భార్యయున్నందుకు సంతానము లున్ను, శాస్త్రములువిన్నందుకు ఆచారవంతుడగుట ఫలము. ౮౭

శ్లో॥ స్వగృహే పూజ్యతే మూర్ఖస్స్వగ్రామే పూజ్యతేప్రభుః।
స్వదేశే పూజ్యతే రాజావిద్వాన్ సర్వత్ర పూజ్యతే॥

తా॥ మూర్ఖుడు తనయింటియందును, ప్రభువు స్వగ్రామమందును, రాజు తనరాజ్యమందును, పూజింపబడుదురు. విద్వాంసుడు సకల దేశములయందును పూజింపబడును. ౮౮

శ్లో॥ కుచేలినం దంత మలాపహారిణం బహ్వాశినం నిష్ఠురవాక్యభాషిణం। సూర్యోదయే చాస్తమయే చశాయినం విముంచతిశ్రీరపి చక్రపాణినం॥

తా॥ మలినవస్త్రము ధరించినవానిని పండ్లుతోమనివానిని తిండిబోతును నిష్ఠురోక్తులు గలవానిని ప్రాతస్సాయంకాలముల నిద్రించువానిని ఇట్టిపురుషుని ఇతరగుణములచేత విష్ణుసమానుడై యున్నను వానిని లక్ష్మిపరిత్యజించును. ౮౯

శ్లో॥ దీర్ఘశృంగ మనడ్వాహం నిర్లజ్జాం విధవస్త్రియం।
శూద్రమక్షర సంయుక్తం దూరతః పరివర్జయేత్॥

తా॥ నిడుపుకొమ్ములుగల యెద్దును సిగ్గులేని విధవస్త్రీని చదువుగలశూద్రుని దూరముగా బరిత్యజింపవలయును॥ ౯౦

శ్లో॥ ముఖంపద్మ దళాకారం వచశ్చందనశీతలం।
హృత్కర్తరీ సమంచాతి వినయం ధూర్తలక్షణం॥

తా॥ తామరరేకులవంటి ముఖవర్చస్సును శ్రీగంధమువలె చల్లనిమాటలును కత్తెరతో సమానమగు మనస్సును అతివినయమును ఈ గుణములు ధూర్తునిలక్షణములు॥ ౯౧

శ్లో॥ మాతృహీనశిశుజీవనంవృథా కాంతహీనవయౌవనంవృథా।
శాంతిహీనతపసఃఫలంవృథా తింత్రిణీరసవిహీనభోజనంవృథా॥

తా॥ తల్లిలేనిబిడ్డయును ప్రియుడులేని ప్రాయమును శాంతిలేనితపము పులుసులేని భోజనమును వ్యర్థము॥ ౯౨

శ్లో॥ వస్త్రముఖ్యా స్త్వలంకారః ప్రియముఖ్యం తుభోజనం ।
గుణోముఖ్యా స్తునారీణాం విద్యాముఖ్యా స్తు బ్రాహ్మణః॥

తా॥ అలంకారమునకువస్త్రమును భోజనమునకు ప్రీతియు నుస్త్రీలకుగుణమును బ్రాహ్మణులకు విద్యయును ముఖ్యములు॥ ౯౩

శ్లో॥ అమృతం సద్గుణాభార్యా అమృతంబాలభాషితం ।
అమృతంరాజసమ్మానమమృతం మానభోజనం ॥

తా॥ గుణవతియైన యాలు బాలునిముద్దుమాటలు రాజసమ్మానము మానయుక్తభోజనము, ఇవియన్నియు నమృతసమానమగును॥

శ్లో॥ దుర్వృత్తోవాసువృత్తోవామూర్ఖఃపండితఏవవా ।
కాషాయదండమాత్రేణ యతిఃపూజ్యోనసంశయః॥

తా॥ యతిదురాచారుడైనను సదాచారుడైనను మూర్ఖుడయినను పండితుడయినను కాషాయదండముల ధరించుటచేతనే పూజ్యుడగును ॥ ౯౫

శ్లో॥ ఉపకారేణనీచానామపకారోహిజాయతే ॥
పయఃపానంభుజంగానాం కేవలంవిషవర్ధనం ।

తా॥ పాముకు పాలుబోయుటచేత మిక్కిలి విషవృద్ధియెట్లు కలుగునో యారీతిగ నీచులకుపకారముచేయ నపకారమేసంభవించును ॥

శ్లో॥ ఋణంయాచ్ఞాచవృద్ధత్వం జారచోరదరిద్రతా ।
రోగశ్చభుక్తశేషశ్చాప్యష్టకష్టాఃప్రకీర్తితాః ॥

తా॥ ఋణముయాచించుట ముదిమివ్యభిచారము దొంగతనము బీదతనము వ్యాధిభుక్తశేషభోజనము ఇవి అష్టకష్టములు॥ ౯౭

శ్లో॥ దాసీభృత్యస్సుతోబంధుర్వస్త్రవాహనమేవచ॥
ధనధాన్యసమృద్ధిశ్చాప్యష్టభోగాఃప్రకీర్తితాః॥

తా॥ దాసీజనులు భటులు కొమారులు చుట్టములు పదార్థములు వాహనములు ధనము ధాన్యముఇవి అష్టభోగములు॥ ౯౮

శ్లో॥ మక్షికామారుతోవేశ్యా యాచకోమూషకస్తథా ।
గ్రామణీర్గణకశ్చైవ నప్తైతేపరబాధకాః॥

తా॥ ఈగెలు గాలి, బోగముది, బిచ్చపువాడు, ఎలుక, గ్రామాధికారి, కరణము. వీరలేడుగురెల్లప్పుడు పరులను బాధించువారనుట॥

శ్లో॥ భూప్రదక్షిణషట్కేన కాశీయాత్రాయుతేనచ॥
సేతుస్నానశతైర్యచ్ఛ తత్ఫలంమాతృవందనే॥

తా॥ ఆరుమారులు భూప్రదక్షిణంబును పదివేలమారులుగంగాస్నానంబును అనేకశతావర్తులు సేతుస్నానంబును వీటివలనకలుగుఫలంబు తమతల్లికి ప్రీతిపూర్వకముగా వందనమాచరించుటచేతనే కలుగుననుట॥ ౧౦౦

శ్లో॥ నాన్నోదకసమందానం నద్వాదశ్యాఃపరంవ్రతం।
నగాయత్ర్యాఃపరంమంత్రంనమాతుర్దైవతంపరం॥

తా॥ అన్నోదకదానముతో సమానదానము నుద్వాదశీవ్రతముకంటె వేరైనవ్రతమును గాయత్రికంటె శ్రేష్ఠమైనమంత్రమునుతల్లికంటె నితరదైవమునులేదు॥ ౧౦౧

శ్లో॥ రాజవత్పుత్రదారాశ్చస్వామివ న్మిత్రబాంధవాః।
ఆచార్యవత్సభామధ్యేభాగ్యవంతంస్తువంతిహి॥

తా॥ లోకమునందు భాగ్యవంతుని, భార్యబిడ్డలును దొరలవలెజూతురు చుట్టములు స్నేహితులు దేవునివలె సేవింతురు సభలో ఆచార్యునివలె గౌరవింతురు గనుక భాగ్యముగలవారే గొప్పవారు॥౧౦౨

శ్లో॥ కపిలాక్షీరపానేన బ్రాహ్మణీసంగమేనచ।
వేదాక్షరవిచారేణశూద్రశ్చండాలతాంవ్రజేత్॥

తా॥ జగంబునశూద్రుడు కపిలవర్ణముగలయావుపాలు త్రాగుటచేతను బ్రాహ్మణస్త్రీసంగముచేతను వేదాక్షరవిచారణచేతను చండాలత్వమునొందును॥ ౧౦౩

శ్లో॥ లోకయాత్రా నయంలజ్జా దాక్షిణ్యం ధర్మశీలతా।
పంచయత్రనవిద్యంతే నకుర్యాత్తేనసంగమం॥

తా॥ లోకవ్యవహారము వెరపు సిగ్గు దాక్షిణ్యము ధర్మస్వభావము ఈయైదుగుణములు లేనిమనుజుని సహవాసము చేయదగదు అంత

శ్లో॥ బాలసఖిత్వమకారణహాస్యం స్త్రీషువివాదమసజ్జనసేవా ।
గార్దభయానమసంస్కృతవాణీషట్సునరోలఘుతాముపయాతి॥

తా॥ బాలురచెలిమికారణములేనినగవును స్త్రీలయెడ వాదులా
డుట దుర్జనునియొద్ద కొలువుండుట గాడిదెనెక్కుట సంస్కృతభాష
తెలియకుండుట ఈయారింటిచేమనుష్యులులాఘవము చెందుదురు॥౧౦౬

శ్లో॥ విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమం ।
నహివంధ్యావిజానాతిగుర్వీంప్రసవవేదనామ్ ॥

తా॥ లోకమందు గొడ్రాలు సహించగూడని ప్రసవవేదననెట్లు
ఎరుగదో యారీతిగ విద్యాహీనుడు విద్వాంసులపరిశ్రమము నెరుంగడు॥

శ్లో॥ విద్యాశ్చతస్రోసాధ్యాస్స్యుర్జన్మనాసహసంభవాః ।
గాంధర్వంచకవిత్వంచశూరత్వందానశీలతా ॥

తా॥ జనులకు సంగీతము కవిత్వము శౌర్యము దానశీలత్వము
ఈనాల్గువిద్యలు నుత్పత్తితోడ గలుగవలసినవిగాని నేర్పుచేతసాధింపదగి
నవికావు॥ ౧౦౭

శ్లో॥ మాతానిందతినాభినందతిపితాభ్రాతానసంభాషతే భృత్యః కు
ప్యతినానుగచ్ఛతి సుతః కాంతాచనాలింగతే। అర్థప్రార్థనశం
కయానకురుతేసల్లాపమాత్రంసుహృత్తస్మాదర్థముపార్జయశ్శృ
ణుసఖే హ్యర్థేనసర్వేవశాః॥

తా॥ దరిద్రుని తల్లి నిందించును తండ్రి సంతసింపడు అన్నద
మ్ములు మాటలాడరు పనివాడు కోపగించుకొనును కొడుకు వెంటరాడు ఆ
లుకౌగిలించుకొనదు తన్ను ద్రవ్యమునడుగునను శంకచేత చెలికాడుప
లుకరించుకొనడు కావున ఓస్నేహితుడాధనముచేత నందరుస్వాధీనులగు
దురుగాన ధనమార్జింపవలెను॥ ౧౦౮

శ్లో॥ గోమూత్రమాత్రేణపయోవినష్టం తక్రస్యగోమూత్రశతేనకిం
వా।అత్యల్పపాపైర్విపదశ్శుచీనాంపాపాత్మనాంపాపశతేనకింవా॥

తా॥ గోమూత్రము కొంచెముపడుటచేతనే పాలుచెడిపోవును
గోమూత్రమెంతకలిసిన మజ్జిగకు చెరుపులేదు ఆలాగేపరిశుద్ధులైన సత్పు

రుషులకు అల్పపాపంబుచేతనే విపత్తుగలుగును పాపాత్ములు కధిక పాపం
బు జేసినను వెరపుగలుగదు॥ ౧౧౯

శ్లో॥ సముద్రమంథనే లేభేహరిర్లక్ష్మీం హరో విషం।
భాగ్యంఫలతిసర్వత్ర నవిద్యానచపౌరుషం॥

తా॥ సముద్రంబును మథించునపుడు విష్ణువు లక్ష్మీదేవినిపొందెను
శివుడు విషంబును పొందెను కాబట్టి వారివారి భాగ్యానుసారంబుగా ఫలం
బుగలుగును॥ ౧౨౦

శ్లో॥ ఆతురేనియమోనాస్తి బాలేవృద్ధే తథైవచ॥
సదాచారరతేచైవ హ్యేషధర్మస్సనాతనః॥

తా॥ రోగికిని బాలునికిని వృద్ధునికిని సదాచారసక్తునికిని వీరల
కువ్రతంబుపనిలేదు॥ ౧౨౧

శ్లో॥ ఏకోదేవః కేశవోవాశివోవాఏకోవాసఃపత్తనేవావనేవా।
ఏకంమిత్రంభూపతిర్వాయతిర్వాఏకానారీసుందరీవాదరీవా॥

తా॥ విష్ణువైన శివుండయిన నొకడే దేవుడవినమ్మవలయు పట్ట
ణమందైన వనమందైన వాసముజేయవలయు రాజుతోనైన సన్యాసి
తోనైన స్నేహముచేయవలయు, సౌందర్యంబుగలభార్యతో కూడియైన
ను గుహాయందైననుండవలయు॥ ౧౨౨

శ్లో॥ అజాయుద్ధేఋషిశ్రాద్ధేప్రభాతే మేఘడాంబరే।
దంపత్యోఃకలహేచైవ బహ్వారంభోలఘుక్రియా॥

తా॥ మేకపోతులయుద్ధమందును ఋషిశ్రాద్ధమందును ప్రాతఃకా
లపు మేఘాడంబరమందును దంపతులకలహమందును వీటియందు ఆరం
భమధికంబును క్రియస్వల్పంబునగును॥ ౧౨౩

శ్లో॥ హతమశ్రోత్రియేదానంహతం సైన్యమనాయకం।
హతారూపవతీవంధ్యా హతోయజ్ఞస్త్వదక్షిణః॥

తా॥ వేదాధ్యయన హీనునికిచ్చినదానము నాయకుడులేని సై
న్యము సౌందర్యవతియైన గొడ్డురాలు దక్షిణలేనియజ్ఞంబును వ్యర్థ
ములు॥ ౧౨౪

శ్లో॥ క్రోధో వైవస్వతో రాజా ఆశా వైతరణీనదీ।
విద్యా కామదుఘా ధేనుస్సంతోషో నందనంవనం॥

తా॥ కోపంబు యమునితో సమానమైనది ఆశ వైతరణీ నదితో సమానమైనది విద్య కామధేనువుతో సమానమైనది సంతోషంబు నందనవనంబుతో సమానమైనది॥ ౧౧౫॥

శ్లో॥ అసారం ఖలుసంసారం సారం శ్వశురమందిరం।
హిమాలయే హరశ్శేతే హరిశ్శేతే మహోదధౌ॥

తా॥ సంసారంబు సారంబులేనిదైనను శ్వశురగృహంబు సారంబుగలదిగనుకనే శివుడు హిమవత్పర్వతమందును విష్ణువు సముద్రమందును శయనించిరి॥

శ్లో॥ అస్థిరం జీవనంలోకే అస్థిరం యౌవనంధనం।
అస్థిరం దారపుత్రాది ధర్మకీర్తి ద్వయంస్థిరం॥

తా॥ జీవితకాలము యౌవనము ధనము దారపుత్రాదులు ఇవి అస్థిరములు తాముచేసిన ధర్మమును దానివలన గలిగెడుకీర్తియు ఈ రెండును శాశ్వతములు॥

ప్రథమభాగము - ముగిసెను.



# నీతిశాస్త్రము - ద్వితీయభాగము.

శ్లో॥ చింతాజ్వరో మనుష్యాణాం వస్త్రాణామాతపోజ్వరః।
అసౌభాగ్యం జ్వరః స్త్రీణా మశ్వానాం మైథునంజ్వరః॥

తా॥ ఎల్లప్పుడు యేదైన చింతతో నుండుట యే మనుష్యులకు జ్వరము వస్త్రంబులకు వేడిమియే జ్వరము స్త్రీలకు అసౌభాగ్యముగనుండుట యే జ్వరము గుఱ్ఱంబులకు మైథునంబొసర్చుట యే జ్వరమని నెఱుంగవలయును.

శ్లో॥ చితాచింతా ద్వయోర్మధ్యే చింతానామ గరీయసీ ।
చితాదహతి నిర్జీవం చింతాప్రాణ యుతంవపుః॥

తా॥ సాదకంబె చింతయధికమైనది ఎట్లనినసాద ప్రాణంబుపో యినపిమ్మట శరీరంబును దహించును చింత ప్రాణంబుతోగూడిన శరీరంబును దహించునుగావున చింతకూడదు॥ ౨

శ్లో॥ ఆజగామ యదాలక్ష్మీ ర్నారికేళ ఫలాంబువత్ ।
నిర్జగామ యదాలక్ష్మీ ర్గజభుక్త కపిత్థవత్॥

తా॥ సంపదవచ్చునపుడు టెంకాయయందలి జలమువలె తనంతట వచ్చును పోవునపు డేనుగుభక్షించిన వెలగపండువలె పోవును. 3

శ్లో॥ నేక్షేతోద్యం తమాదిత్యం నాస్తంయాతం కదాచన ।
నోపసృష్టం నవారిస్థం నమధ్యం నభసోగతం॥

తా॥ సూర్యుడుదయించుచున్నపుడు అస్తమయ మౌచున్నపుడు ఆకాశమధ్యంబు బొందియున్నపుడు ప్రతిసూర్యుని ఉదకమందలి సూర్యప్రతిబింబంబును జూడగూడదు. ౪

శ్లో॥ నలంఘయే ద్వత్సతంత్రీం నప్రధా వేచ్చవర్షతి ।
నచోదకే నిరీక్షేత స్వంరూప మితిధారణా॥

తా॥ దూడపలుపు దాటగూడదు వానయందు పరుగిడరాదు నీటియందు తననీడ జూచుకొనరాదు. ౫

శ్లో॥ నాశ్నీయాద్భార్య యాసార్థం నైనామీక్షేత చాశ్నతీం ।
క్షువంతీం జృంభమాణాం వానచాసీనాంయథాసుఖం ।
నాంజయంతీం స్వకేనేత్రే నచాభ్యక్తా మనావృతాం ।
నపశ్యేత్ప్ర సవంతీంచ తేజస్కామో ద్విజోత్తమః॥

తా॥ భార్యతోకూడ భోజనముసేయకూడదు భార్యభోజనము సేయుచుండగా తుమ్ముచుండగా ఆవలించుచుండగా యథాసుఖముగా గూర్చుండియుండగా కన్నులకుకాటుక బెట్టుకొనుచుండగా అభ్యంగనము చేసుకొనుచుండగా దిగంబరయైయుండగా ప్రసవించుచుండగా పుట్టినసమయమునను భార్యను తేజస్కాముడగు ద్విజుడుచూడరాదు. ౬

శ్లో॥ నాన్నమద్యా దేకవాసా ననగ్నస్స్నాన మాచరేత్।

తా॥ బ్రాహ్మణుడు ఒంటివస్త్రముతో భుజింపరాదు దిగంబరుడై స్నానముచేయగూడదు.

శ్లో॥ నమూత్రం పథికుర్వీత నభస్మ ని నగోవ్రజే।
నఫాలకృష్టేన జలేనచిత్యాం నచపర్వతే।
నజీర్ణ దేవాయతనే నవల్మీకే కదాచన।
ననసత్త్వేషుగర్తేషు నగచ్ఛన్నాపిచస్థితః।
ననదీతీర మాసాద్యన చపర్వత మస్తకే।
వాయ్వగ్ని విప్రానాదిత్య మపఃపశ్యం స్తథైవగాః।
నకదాచనకుర్వీత విణ్మూత్రస్య విసర్జనం॥

తా॥ త్రోవబూడిదె ఆవులమందదున్ననేల జలముసాదకొండ శిథిలమైన దేవాలయము పుట్టజంతువులతో గూడినబొక్క వీనియందును నడుచుచు నిలుచుండియు నదీతీరమందును పర్వతశిఖరమందును విణ్మూత్రంబులను విడువరాదు మఱియు వాయ్వగ్ని బ్రాహ్మణులను సూర్యుని ఉదకమును గోవులను వీటినిజూచుచును విణ్మూత్రమ్ముల విడువరాదు॥ ౧_౨౬

శ్లో॥ మూత్రోచ్చారసముత్సర్గం దివాకుర్యాదుదఙ్ముఖః।
దక్షిణాభి ముఖోరాత్రౌ సంధ్యయోశ్చ యథాదివా।
ఛాయాయామం ధకారేవా రాత్రావ హనివాద్విజః।
యథాసుఖముఖఃకుర్యాత్ప్రాణబాధాభయేషుచ॥

తా॥ పగటియందుసంధ్యాకాలములయందుఉత్తరాభి ముఖుడైయ్యైను రాత్రియందు దక్షిణాభిముఖుడయ్యైను విణ్మూత్రములనువిడువవలసినది. నీడయందు అంధకారమందును ప్రాణబాధాభయంబునందు దివారాత్రిలలో నెచ్చటయిన ఏదిదిక్కునకైన కూర్చుండి విణ్మూత్రంబులవిడవవచ్చును॥ ౧_౨౭

శ్లో॥ నాగ్నింముఖే నోపధమే న్నగ్నాంనేక్షే తచస్త్రియం।
నామేధ్యం ప్రక్షిపేదగ్నౌ నచపాదౌ ప్రతాపయేత్॥

తా। అగ్నిని నోటిచేత నూదరాదు దినమొలతోనున్న స్త్రీని జూడరాదు అపరిశుద్ధమైన వస్తువు నగ్నియందు వేయరాదు అడుగులనుగా చుకొనగూడదు.

శ్లో॥ నైకస్సుప్యా చ్ఛూన్యగేహే శయానంన ప్రబోధయేత్ ।
నోదక్యయాభిభాషే తయజ్ఞం గచ్ఛేన్న చావృతః॥

తా॥ శూన్యగృహమందొక్కడు నిద్రింపగూడదు నిద్రించువాని లేపగూడదు రజస్వలయైయున్న స్త్రీతో మాట్లాడరాదు పిలువకనేయజ్ఞంబునకు పోవలయును. ౧౨౯

శ్లో॥ నాధార్మికే వసేద్గ్రామే నవ్యాధి బహుళేభృశం ।
నైకః ప్రపద్యే తాధ్వానంనచిరం పర్వతేవసేత్॥

తా॥ ధార్మికులులేని యూరియందును మిగులవ్యాధిబహుళమైన యూరియందు నుండరాదు ఒకడుగా త్రోవనడువరాదు కొండయందు చిరకాలంబు నివసింపరాదు. ౧౩౦

శ్లో॥ ఉపానహౌచ వాసశ్చ ధృతమన్యైర్న ధారయేత్ ।
ఉపవీత మలంకారం స్రజంకర కమేవచ॥

తా॥ ఒకరిచేతధరింపబడిన పాదరక్షలు, వస్త్రము, యజ్ఞోపవీతము, అలంకారము, పుష్పమాలిక కమండలము, వీనినిమఱియొకడు ధరింపరాదు. ౧౩౨

శ్లో॥ నావినీతైర్వ్రజేద్ధుర్యైర్న చక్షుర్వ్యాధి పీడితైః ।
నభిన్నశృంగా క్షిఖురైర్న వాలవిధి రూపితైః ।
వినీతైస్తు వ్రజేన్నిత్య మాశుగైర్ల క్షణాన్వితైః ।
వర్ణరూపో పసంపన్నైః ప్రతోదేనా తుదన్భృశం॥

తా॥ శిక్షితంబుగాక నేత్రవ్యాధిపీడితములై విరిగినకొమ్ములుగొరిసెలు గుడ్డికన్నులుగలిగి కోయబడిన తోకగలిగినట్టి ఎద్దులు గుఱ్ఱంబులు మొదలైనవి గట్టినబండి మొదలైనవాటిని ఈలాటిగుఱ్ఱము మొదలైనవాటిని నెక్కిపోరాదు శిక్షితములై వేగముగలిగి వర్ణరూపాది లక్షణయుక్తంబులైన వాహనంబులనెక్కి మిక్కిలి వాటినిపీడింపక పో

ఖంబుగ బోవలయును. ౧౩౩

శ్లో॥ బాలాతపః ప్రేతధూమో వర్జ్యంభిన్నం తథాసనం ।
నచ్ఛింద్యాన్న ఖలోమాని దంతైర్నోత్పాటయేన్నఖాన్ ॥

తా॥ లేతయెండయును బీనుగమీది పొగయును విరిగినపీటయును వర్జింపదగినది గోళ్ళను వెండ్రుకలను గిల్లరాదు పంళ్లచేతగోళ్ళనుత్రీయరాదు. ౧౩౪

శ్లో॥ లోష్ఠమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీ చయోనరః ।
సవినాశం వ్రజత్యాశు సూచకోశు చిరేవచ ॥

తా॥ మట్టిపెళ్ళలను నలుపువాడును, తృణంబును ఛేదించువాడును గోళ్లుకొరుకువాడును, కొండెము జెప్పెడివాడును, అపరిశుద్ధుడైనవాడును, వీరలు వృద్ధిబొందరుకావున నీపనులను చేయరాదు. ౧౩౫

శ్లో॥ నవిగర్హ్యకథాంకుర్యా ద్బహిర్మాల్యం నధారయేత్ ।
గవాంచయానం పృష్ఠేన సర్వథైవ విగర్హితం ॥

తా॥ నిందింపదగిన ప్రబంధకల్పన చేయరాదు వెలుపల మాల్యముధరింపరాదు యెద్దునెక్కిపోవుట అన్నివిధంబులచేతనిషిద్ధమైనది.

శ్లో॥ అద్వారేణ చనాతీయా ద్గ్రామంవా వేశ్మవావృతం ।
రాత్రౌచ వృక్షమూలాని దూరతః పరివర్జయేత్ ॥

తా॥ గ్రామమునకుగాని ఇంటికిగాని వాకిలివిడిచి తప్పుదోవవలన పోరాదు రాత్రియందు వృక్షమూలములను బరిత్యజింపవలయును. ౧౩౭

శ్లో॥ నస్నానమాచరేద్భుక్త్వా నాతురోన మహానిశి ।
నవాసోభిస్సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే॥

తా॥ భోజనము చేసినపిమ్మటను, వ్యాధిపీడితుడై యున్నపుడు నిశీథకాలంబునందు యెల్లప్పుడు వస్త్రములేకుండ తానెఱుగని మడుగువందును స్నానముచేయరాదు. ౧౩౮

శ్లో॥ వైరిణంనోప సేవేతసహాయం చైవవైరిణః ।
అధార్మికం తస్కరంచ పరస్యైవ చయోషితం॥

తా॥ శత్రువును శత్రుస్నేహితుని, ధర్మహీనుని, దొంగను, పరస్త్రీ

౨, వీరలంగూడదరాదు. ౧౩౯

శ్లో॥ క్షత్రియం చైవసర్పంచ బ్రాహ్మణంచ బహుశ్రుతం ।
నావమన్యేత వై భూష్ణుః కృశానపి కదాచన ॥

తా॥ అభివృద్ధిగాగలనరుడు రాజును, పామును బ్రాహ్మణుని, పండితుని, కృశించినవారలను, వీరలనొకప్పుడు నవమానింపరాదు. ౧౪౦

శ్లో॥ సత్యంబ్రూయాత్ప్రియంబ్రూయాన్నబ్రూయాత్సత్యమప్రియం
ప్రియంచనానృతంబ్రూయా దేషధర్మ స్సనాతనః ॥
భద్రంభద్ర మితిబ్రూయా ద్భద్రమిత్యే వవావదేత్ ॥

తా॥ సత్యముగా నిష్టముగా బలుకవలయు సత్యమైనదైనను అప్రియమును బలుకరాదు ప్రియమైనదైనను అసత్యమును బలుకరాదు భద్రమనగా శుభముకావున నొకరికిప్రియము బలుకునపుడు భద్రముభద్రమని పలుకవలయును. ౧౪౧

శ్లో॥ శుష్కవైరం వివాదంచ నకుర్యాత్కే నచిత్సహా ॥

తా॥ ఎవనితోనైనను నిష్ప్రయోజనమైన విరోధమును వివాదమును జేయరాదు. ౧౪౨

శ్లో॥ హీనాంగాన తిరిక్తాంగాన్ విద్యాహీనాన్ వయోధికాన్ ।
రూపద్రవ్య విహీనాంశ్చ జాతిహీనాంశ్చ నాక్షిపేత్ ॥

తా॥ కుఱుచలు నిడుపులునైన చేతులుకాళ్ళు మొదలైన అవయములు గలవారలను విద్యావిహీనులను వయస్సుచేత పెద్దలైనవారలను, సౌందర్యము ద్రవ్యము జాతివీటిచేత తక్కువైనవారలను, వీరినాక్షేపింపగూడదు. ౧౪౩

శ్లో॥ శ్రద్ధధానా శ్శుభాంవిద్యా మాదధీతా వరాదపి ।
అంత్యాదపి పరంధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి ॥

తా॥ మంచివిద్యను జాత్యాదివిహీనుని వల్లనైనను శ్రద్ధాయుక్తుడై గ్రహింపవచ్చును ఉత్తమమైన ధర్మమును చండాలునివల్లనైనను గ్రహింపవచ్చును సద్గుణవతియైన స్త్రీని దుష్కులమువల్లనైనను గ్రహిం

శ్లో॥ విషాదప్యమృతంగ్రాహ్యం బాలాదపి సుభాషితం ।
అమిత్రాదపి సద్వృత్త మమేధ్యాదపి కాంచనం ॥

తా॥ విషమువల్లనైనను నమృతంబును గ్రహింపవలయు బాలునిచేనైనను మంచిమాటలను గ్రహింపవలయును శత్రువునివల్లనైన సత్స్వభావమును గ్రహింపవలయునుఅమేధ్యమువల్లనైనను బంగారమును గ్రహింపవలయును. ౧౪౫

శ్లో॥ స్త్రియోరత్నాన్యథోవిద్యా ధర్మశ్శౌచం సుభాషితం ।
వివిధాని చశిల్పాని సమాధేయా నిసర్వతః ।

తా॥ సద్గుణవతులైన వనితలు, రత్నములు, విద్యలు, ధర్మము, పాగిశుద్ధ్యము, సద్వాక్యము, నానావిధములైన శిల్పములు, ఇవియెచ్చటనున్నను గ్రహింపలయును. ౧౪౬

శ్లో॥ హీనజాతి స్త్రియంమోహా దుద్వహంతో ద్విజాతయః ।
కులాన్యేవ నయంత్యాశు ససంతానా నిశూద్రతాం ॥

తా॥ ద్విజాతులనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వీరుహీనజాతిస్త్రీని మోహమువలన పరిగ్రహించిరేని వారికికలిగెడు సంతానములతోగూడవారికులములు శూద్రత్వమును బొందును. ౧౪౭

శ్లో॥ యద్యత్పర వశంకర్మ తత్తద్యత్నే నవర్జయేత్ ।
యద్యదాత్మ వశంతుస్యా త్తత్తత్సేవే తయత్నతః ।
సర్వంపర వశందుఃఖం సర్వమాత్మ వశంసుఖం ।
ఏతద్విద్యా త్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః ॥

తా॥ పరాధీనమైన కార్యమును విడువవలయు స్వాధీనమయిన కార్యమును చేయవలయు అదియేమనిన పరాధీనమైనవన్నియు దుఃఖకరంబులు స్వాధీనమైనవి సుఖకరంబులు ఇవి సంక్షేపముగా సుఖదుఃఖములకు లక్షణము ॥ ౧౫౦

శ్లో॥ అదాత్రిహేస్రై వభూతానామప్యత్రోహేణమాపునః ॥
యావత్తి సాంపమాస్థాయ విప్రోజీవేవనాపది ।

తా॥ బ్రాహ్మణుండు ఆపత్కాలమందు సకల భూతములకు ద్రోహముగలుగ నివృత్తిచేత జీవింపవలయును భూతములకు స్వల్పబాధకలుగజేయునట్టి వృత్తిచేతనైన జీవింపవచ్చును॥ ౧౫౧

శ్లో॥ ఋతామృతాభ్యాంజీవేత్తుమృతేనప్రమృతేనవా ।
సత్యానృతాభ్యామపివానశ్వవృత్త్యాకదాచన ।
ఋతముంఛశిలంజ్ఞేయ మమృతంస్యాదయాచితం ।
మృతంతుయాచితంభైక్షం ప్రమృతం కర్షణంస్మృతం ।
సత్యానృతంతువాణిజ్యంతేనచైవాపిజీవ్యతే ।
నశ్వవృత్తిర్నచాభ్యాసేత్తస్మాత్తాంపరివర్జయేత్ ॥

తా॥ ఇండ్లయందు రోళ్ళమొదటబడిన గింజల నేరుకజీవించుట ఉంఛము, మళ్ళలోని యెన్నులుదెచ్చుకొని జీవించుట శిలము ఈ రెండును ఋతమనంబడును. అమృతమనగా యాచించబడక యదృచ్ఛాలబ్ధమైన ద్రవ్యముచేతజీవించుట. మృతమనగా యాచించుటవలన లభించిన ద్రవ్యముచేతజీవించుట, ప్రమృతమనగా కృషి సత్యానృతమనగా వర్తకము శ్వవృత్తియనగా కొలువుగొలుచుట. ఇందు బ్రాహ్మణునికి వెనుక చెప్పబడిన యొక్కొక్క వృత్తికంటె ముందు చెప్పబడిన యొక్కొక్క వృత్తి శ్రేష్ఠమైనది గనుక ఉంఛవృత్తి మొదలు వాణిజ్యమువరకు జెప్పబడినవృత్తులచేత జీవించవచ్చును. గాని బ్రాహ్మణుండు శ్వవృత్తిచేత నొకప్పుడును జీవింపరాదు॥ ౧౫౨

శ్లో॥ విప్రాణాం జ్ఞానతోజ్యైష్ఠ్యం క్షత్రియాణాంతువీర్యతః ।
వైశ్యానాంధాన్యధనతశ్శూద్రాణామేవజన్మతః॥

తా॥ బ్రాహ్మణులలో జ్ఞానముగలవాడు పెద్ద క్షత్రియులలో పరాక్రమవంతుడు పెద్ద వైశ్యులలో ధనధాన్యములు గలవాడు పెద్ద శూద్రులలో వయోధికుడే పెద్ద॥ ౧౫౩

శ్లో॥ విత్తంబంధుర్వయఃకర్మ విద్యాభవతిపంచమీ ।
ఏతానిమాన్యస్థానంచగరీయోయద్యదుత్తరం॥

తా॥ ధనము బంధుత్వము వయస్సు కర్మ విద్య ఈ ౫ న్ను సన్మా

నింపదగిన స్థానములు ఇందుముందరజెప్పబడినవానికంటె వెనుకజెప్పబడి నవి శ్రేష్ఠస్థానములు అదియెట్లనిన ధనికునికంటె బంధువు శ్రేష్ఠుడు బంధువునకంటె వయోధికుడు శ్రేష్ఠుడు వయోధికునికంటె నుత్తమక్రియావంతుడుముఖ్యుడు వానికంటె విద్యావంతుడు మిక్కిలి శ్రేష్ఠుడు ॥౧౫౪

శ్లో॥ విద్యానామనరస్యరూపమధికం ప్రఛ్ఛన్నగుప్తంధనం ।
విద్యాభోగకరీయశస్సుఖకరీ విద్యాగురూణాంగురుః ॥
విద్యాబంధుజనో విదేశగమనే విద్యాపరాదేవతా ।
విద్యారాజసుపూజ్యతేనహిధనం విద్యావిహీనఃపశుః ॥

తా॥ విద్య పురుషునికి శ్రేష్ఠమయినరూపము రహస్యముగా దాచినధనము భోగమును కీర్తినిసుఖమునుగలుగజేయునది గురువులకందరికి పూజ్యమైనది. దేశాంతరగమనమున బంధుజనమువలె రక్షించునది ఉత్తమమైన దైవమువలె నభీష్టములనిచ్చునది ప్రభువులన పూజింపబడు నావిద్యకు సరియైనధనములేదు గావున నట్టివిద్యలేనివాడు పశుప్రాయుడనిభావము॥ ౧౫౫

శ్లో॥ క్షాంతిశ్చేత్కవచేనకింకిమరిభిః క్రోధోస్తిచేద్దేహినాం ।
జ్ఞాతిశ్చేదనలేనకింయదిసుహృద్దివ్యౌషధైఃకింఫలమ్ ।
కింసర్పైర్యదిదుర్జనాః కిముధనైర్విద్యానవద్యాయది ।
వ్రీడాచేత్కిముభూషణైస్సుకవితాయద్యస్తిరాజ్యేనకిం ॥

తా॥ ఓరుపు కవచమువంటిది. క్రోధము శత్రువువంటిది. జ్ఞాతినిప్పువంటివాడు స్నేహితుడు దివ్యౌషధమువంటివాడుదుర్జనుడు సర్పమువంటివాడు అమోఘమైనవిద్యయున్న ధనముచేత నేమిప్రయోజనము లజ్జ భూషణమువంటిది. సుకవిత్వము రాజ్యమువంటిదని భావము॥ ౧౫౬

శ్లో॥ దాక్షిణ్యంస్వజనే దయాపరిజనే శాఠ్యంసదాదుర్జనే ।
ప్రీతిస్సాధుజనేనయోనృపజనే విద్వజ్జనేచార్జవం ।
శౌర్యంశత్రుజనే క్షమాగురుజనే కాంతాజనే ధృష్టతా ।
యేచైవంపురుషాః కళాసుకుశలాస్తేష్వేనలోకస్థితిః ॥

తా॥ బంధుజనులయందు దాక్షిణ్యమును భృత్యులయందుదయయు

టగలిగియున్న వేరేపాపముపని లేదు. సత్యముగలిగియున్న వేరేతపస్సుపని లేదు. మంచిమనస్సుగలిగియున్న తీర్థయాత్రవలదు. సౌజన్యముగలిగియున్న వేరేబలమువలదు. మహిమగలిగిన వేరేభూషణముపని లేదు. మంచివిద్యగలిగిన ధనముపని లేదు. అపకీర్తిగలిగిన మృత్యువుపని లేదు.

శ్లో॥ లోకఃపృచ్ఛతిసద్వార్తాంశరీరేకుశలంతవ ।
కుతఃకుశలమస్మాకమాయుర్యాతిదినేదినే ॥

టీ॥ సాధారణంబుగలోకము నన్దరప్పనీకు కుశలమా అని యడిగెదరు. ఓహో దినదినంబును క్షీణింపుచుండెడి ఆయువుగలమనకు కుశలంబెక్కడిది అనగా నూరుసంవత్సరంబుల పరిమితిగల మనుజులకు నొక్కొక్కదినంబును గతించుచుండగా నాయువు నశించుచునే వచ్చుచున్నది. అగుటవలన కుశలంబెక్కడిది ॥

నీతిశాస్త్రము - ద్వితీయభాగము,

సంపూర్ణము.

